# వాణి



## సంక్రాంతి సంచిక

జనవరి 1-15 కార్యక్రమాలు

విడి ప్రతి వెల 35 పైసలు

22 * 12 * 1966.



మహాకవి జి. శంకర కురుప్: స్వీయకవిత [మలయాళం]
(ఇటీవల మద్రాస్ కేంద్రంనుండి ప్రసారితము)



ఇటీవల మద్రాస్ కేంద్రాన్ని సందర్శించిన ప్రఖ్యాత రచయిత, పరిశోధకుడు లారెన్స్ వాన్‌డెర్ పోస్ట్ అతిథులతో ముచ్చటించు దృశ్యం.



''ప్రగతి పథములో రేడియో గోష్ఠులు'' అను విషయంపై జరిగిన చర్చలో పాల్గొన్న ప్రముఖులు.
(ఇటీవల హైదరాబాద్ కేంద్రంనుండి ప్రసారితము)



సంగీతామృతం: టి. కె. రంగాచారి
(హైదరాబాద్, జనవరి 1)



ఎ. పి. కోమల: ఈమానపు పాట
(మద్రాస్, జనవరి)



నాగర్‌కోయిల్ ఎస్. హరిహర అయ్యర్
(మద్రాస్, జనవరి 15)

వాణి
ప్రతినెలా 7, 22 తేదీలలో వెలువడును,
విడి ప్రతి వెల 35 నయాపైసలు,
సం॥ చందా రూ. 8-40 పై. (పోస్టేజి సహా)
సంవత్సరమునకు తక్కువ చందా
అంగీకరింపబడదు.
ఇతర వివరములకు,
ఎడిటర్: "వాణి"
ఆల్ ఇండియా రేడియో మద్రాస్-4.
ఫోన్ నెం. 71041 ఎక్స్టెన్షన్స్ 243 & 245



ALL INDIA RADIO



సంపుటము XVIII వాణి 22—12—1966 సంచిక 15

# ఎన్నికలు - సిద్ధాంతాల ప్రాముఖ్యము

అవుల సాంబశివరావు

ప్రజాస్వామ్యం రెండు రకాలు. పౌరులు సూటిగా తమంతట తాముగా, విషయ నిర్ణయ సభలలో పాల్గొని, విధానాలు నిర్ణయించడం ఒక రకం. అయితే ఈ పద్ధతి, పెద్దరాజ్యాలలో కుదరదు. ప్రాచీన కాలంలో గ్రీకు పట్టణ రాజ్యాలలో ఈ పద్ధతి అమలు జరిగేది. రాజ్యమంతా ఒకే ఒక పట్టణం కనక అందులోని పౌరు లందరు సమావేశమై, పరిపాలనా విధానాన్ని నిర్ణయించుకొనడం సాధ్యమయ్యేది. కాలం మారిపోవడంతో రాజ్యాలు పెద్దవైనాయి. పౌరులు అసంఖ్యాకులైనారు దీనికితోడు జనాభా విపరీతంగా పెరిగిపోయింది. అంతటితో పౌరులు సూటిగా విధాన నిర్ణయం చేసే పద్ధతి అంతమయింది.

## పార్లమెంటరీ ప్రజాస్వామికం

అందువల్ల రెండవ ప్రజాస్వామిక విధానం అమలులోకి వచ్చింది. పౌరులు తమ ప్రతినిధులను ఎన్నుకొంటారు. ఎన్నుకోబడిన ఆ ప్రతినిధులు శాసన సభలలో సమావేశమై, ప్రజల పేరుతో శాసనాలు చేస్తారు. ఈ పద్ధతిని పార్లమెంటరీ ప్రజాస్వామికమని పిలుస్తారు ఈ నాడు ప్రజాస్వామ్య పద్ధతిని అనుసరిస్తున్న రాజ్యాలన్నీ, ప్రధానంగా, యీ విధానాలే అవలంబిస్తున్నాయి.

పార్లమెంటరీ విధానం వచ్చినపిమ్మట పార్టీ పద్ధతి అమలులోకి వచ్చింది. ఒక ఆశయాన్ని ఆర్థించేవారు, ఒక గమ్యాన్ని కోరేవారు, ఒక జీవిత విధానం సృష్టించ దలచుకున్న వారందరు ఏకమై ఒక పార్టీగా పనిచేయడం ప్రారంభించారు. దానితో రాజకీయ పార్టీలు పుట్టుకువచ్చినయి. ఆ రాజకీయ పార్టీలు క్రమంగా బలాన్ని పెంచుకుని, రాజ్యాంగంలో ప్రముఖ పాత్రను నిర్వహించే స్థితికి వచ్చినయి.

## నియోజక వర్గాలు

పౌరులను ప్రతి రాజ్యము, నియోజక వర్గాలక్రింద విభజిస్తుంది. ఆ నియోజక వర్గాలు తమ ప్రతినిధులను శాసనసభలకు, పార్లమెంటులకు ఎన్నుకుంటాయి. రాజకీయ పార్టీలు తమ ప్రతినిధులను నియోజక వర్గాలలో ఎన్నికకు నిలబెడతాయి. శక్తివున్న బలమైన పార్టీలు అన్ని నియోజకవర్గాలలోను తమ ప్రతినిధులను నిలబెట్టవచ్చును. మరికొన్ని, పరిమితమైన శక్తిగలవి, కొన్ని నియోజక వర్గాలలోనే తమ ప్రతినిధులను నిలబెట్టవచ్చును.

పౌరులు అభ్యర్థులకు తమ వోట్లనిచ్చినప్పుడు, ఆ అభ్యర్థిచెందిన పార్టీకి వోటు యిస్తున్నట్లవుతుంది. ఏ పార్టీకి చెందిన అభ్యర్థులు ఎక్కువగా ఎన్నికవుతారో, ఏ పార్టీ శాసనసభలో, పార్లమెంటులో అధికబలం ఉంటుందో ఆ పార్టీ పరిపాలన లోకి వస్తుంది. ఆ పార్టీ నాయకుడు ముఖ్యమంత్రో, ప్రధాన మంత్రో అవుతాడు. తన పార్టీలోనుండే తోటి మంత్రులను ఏరుకుంటాడు శాసనసభలలో ఆ పార్టీకి చెందినవారు అధికసంఖ్యాకులు కనక వారు కోరింది శాసన మవుతుంది. మంత్రిమండలి ఆ పార్టీకి చెందినదే కనక

## ఈ సంచికలో

ముఖచిత్రం: సంక్రాంతికి స్వాగతం
[శ్రీ మారేమండ శ్రీనివాసరావు రేఖాచిత్రం]
[సంక్రాంతి పండుగ సందర్భమున ఆకాశవాణి వివిధ కేంద్రాలనుండి జనవరి 14-వ తేదీన ఈ పండుగను గూర్చిన కార్యక్రమాలను వినవచ్చును.]

శాసనాల అమలు పరిపాలన, ప్రభుత్వము ఆ పార్టి చెప్పుచేతల్లోనుంటుంది, ఈవిధంగా రాజ్యాంగంలో పార్టీల ప్రాబల్యం పెరిగింది, క్రమంగా తారస్థాయినందుకున్నది, వ్యక్తిగతమైన ప్రతినిధుల ప్రాధాన్యత సన్నగిలి మూకఉమ్మడి వ్యవస్థ అయిన పార్టీకి, అధిక్యత పెరిగింది,

## వ్యక్తిగత అర్హతలు

వ్యక్తులకు ప్రాధాన్యతను తగ్గించి. పార్టీలకు ఆధిపత్యం యిచ్చే వ్యవస్థ, ప్రజాస్వామ్యానికి ఎంతవరకు అనుకూలమో విజ్ఞులు నిర్ణయించవలసి ఉంది పార్టీ విధానం సిసలైన ప్రజాస్వామిక సిద్ధాంతానికి విరుద్ధమని భావించి, వాదించే ఒక ఆలోచనా పద్ధతి ఉంది. నిజమైన ప్రజాసేవకులను, వ్యక్తిగతమైన అర్హతానర్హతల పరీక్షమీద, ప్రతినిధులుగా ఎన్నుకునే అవకాశం, పార్టీ విధానంలో సాధ్యంకాదని వారి అభ్యంతరం, ప్రతినిధులు, ప్రజాప్రతినిధులమని మరచి, పార్టీసభ్యులుగానే వ్యవహరిస్తున్నారని ఇంకొక అభ్యంతరం పర్యవసానంలో పార్టీరాజ్యాంగం కంటె పౌరులకంటె కూడా ప్రాబల్యాన్ని సంపాదిస్తున్నదని మరొక అభ్యంతరం, పార్టీ విధానానికి ఇటువంటి సందేహాలు, అభ్యంతరాలు ఉన్నాయి ప్రజాస్వామికవాదులైన రాజకీయ శాస్త్ర పండితులు, యీ విషయాన్ని సునిశితంగా పరిశీలించవలసి ఉంది. పరిశీలించి దారిచూపవలసి ఉంది

## వోటు విలువ

ఈ ఎన్నికలు మూడేండ్ల కొకతూరో అయిదేండ్ల కొకతూరో








"హరితో రంగ హరి"    చిత్రకారుడు: వి. రామమూర్తి

జరుగుతూ ఉంటాయి. ఎన్నికలు జరిగినప్పుడల్లా ప్రతిపార్టీ తన సిద్ధాంతాలను ఆశయాలను, కార్యక్రమాలను నిర్ణయించుకుని ప్రజలముందు ఉంచుతుంది ఎన్నికలలో ముఖ్యంగా పార్టీ ప్రాతిపదికపై జరిగె ఎన్నికలలో ఈ సిద్ధాంతాల కార్యక్రమాల అవసరం ఎంతైనా ఉంది. నిజానికి యీ ఎన్నికలు అర్థరహితమవతాయి. నిష్ప్రయోజనమవుతాయి. ఎన్నికలలో పౌరుడు తన వోటును ఎలా వినియోగించుకోవాలి? ఎవరికి తన వోటు వెయ్యాలి? ఈనాటి ప్రజాస్వామిక వ్యవస్థలో మూడేండ్లకో, అయిదేండ్లకో ఒకసారి తన వోటు వెయ్యడమే, పౌరుడు నిర్వహించే కర్తవ్యం, పౌరులు యిచ్చే వోట్లను బట్టి పార్టీలు అధికారంలోకి వస్తాయి. అయినప్పుడు ఆవోటు చాలా విలువైనది. దేశ భవిష్యత్తును భావి కార్యక్రమాన్ని నిర్ణయించేది. కనక పౌరులు తమ వోటును, పదిలంగా అస్తారుబతంగా వాడుకోవాలి, ఆలోచించి

[తరువాయి 46-వ పేజీలో]

# సమాగతి

డా॥ జి. వి. కృష్ణరావు

ప్రజ్ఞానకలశాయ, ప్రమిత ధర్మస్వరూప
సిద్ధబోధాయ, సంతప్త జీవలోక
హర్షవర్షాయ, శమిత భవానలాయ
భాద్రపద దర్శనాయ తుభ్యం నమోస్తు

అమృతహస్తుతె యయ్యు నంగహీనత మాన్ప
జూడని వేల్పు వెజ్జులను నవ్వి,
స్వారాజ్య పదమేలు స్వామియయ్యును కోడి
యై కూయు నింద్రునయ్యాట గరసి,
ధర్మవృద్ధి దలంచి తలమోయు దనుజారి
లీలావతారంపు లెక్క లెన్ని,
వెండికొండలమీది వెడమోహమున దేలు
వరము భిక్షుకవృత్తి బరిహసించి,

వచ్చి వెలసి యుండునటె శ్రీపర్వతమున
అమృతహస్తుడై చపలేంద్రియాశ్వ వల్గు
వల్గన నిరోధియై సంప్రవర్ధమాన
ధర్మవృక్షమై భిక్షువై కర్మయోగి

గాథలు గాథలై గురునగంబుల జారు మహాఝరంబులై
బాధిత నాథు గర్జ గలపన్ గరుణామతి బాలు కుంజరీ
యూథములై, ఘనాఘన నియుక్త తటిల్లతలై దిశాంత సం
శోధములై చరించునటె శోభను డాతని పుణ్యవృత్తముల్

నామగ్రాహము వాని బేరుకొని సంతానమ్ముచే మెప్పుగే
లోపంజేసి తరించె జన్మమని తా నుప్పొంగు నిల్లాలు త
న్నామ స్మారము బోధసేయ దొడగున్ వైద్యానుసంధానమున్
బ్రాహ్మణ్యార్థ విచారమున్ గురుడు ఛాత్రశ్రేణి కేవ్వేళలన్

తలకొని పోరు నాటోతులైన నతని
పేరుచెప్పిన మాత్రాన వీడిపోవు
సత్వలోకానుకంపి ప్రసంగమైన
వాని యాఖ్యతో జిటికెన వ్రాలుచుండు

తాదృశ మహమాన్వితు డీ
పేటకు ముదుసలికి గావిపియనె శిశుం
బూదయమది దైవ వ్యా
పాదిత దృక్కునకు గానవచ్చుట గాదే

అంధుండవి దండశ్రీ
బంధురంబవి [illegible]

సందేహంబులు? కరుణా
సింధువు మృదువీక్షణమ్ము చిందుచున్ మనుచున్

ఓహో బహుంతర మీ వ్యా
మోహము తోయధికి లోతు పొల్చను తారా
వ్రీహులకు లెక్క చెప్పదు
ఊహామృగమైన యాస కెక్కడి మేరల్?

మాడిపోయిన విత్తు క్రమ్మ మొలవరాదు
వెడలి చన్న చూడ్కి ని మొలిపింపరాదు
దీనవృత్తి కాతడు దయమాను డగుచు
మంత్రజలములు ప్రోక్షించి మాన్పగలడె?

వట్టి యడియాస యీ చెవి వట్టియార్ప
ఆడుచున్నాడ గాకేమి పాడిగలదు?
నిష్పృహుండనై యిట్లు సందేహమంద
దగదు, మలసి దివ్వియ ప్రదీప్తంబుగాదె?



హంపుగ సంబరం

చిత్రకారుడు: పి. రామమూర్తి

అనికొని యాడుచు బెనుగా
డ్పున నుడివడు వార్ధిలోని పోతము వలెఁ గ్రిం
దును మీదగుచు ముదిసి పం
డిన కొండొక యంధవృద్ధు డెవ్వగ నడచున్

అనికొని—

దగదొట్టి చనుచు మడుగుస్రోవలో గర్త శిలగావిన్న ఖండాలమ్ము
చీకటి కోనలో జీబుటడవులందు దారితప్పిన బాటసారి వోలె
పెనుగాలి వానసోకున పొంగు మున్నీటి కడుపులోపలి తరంగమ్ముభంగి
క్రందు సందడిసాయ గట్టంబు రిక్కించి దిక్కులారించు తిర్యక్కుమాడ్కి

మందమందమ్ముగా సాగి మగుడ నిలుచు
దండముఖమున మార్గమ్ము తడవి చూచు
మిట్టపల్లమ్ము తెలియక కొట్టుకాడు
అగి సద్దాలకించు నయ్యంధవృత్తి.

అటువలె సాగుచుండగ మహావృక్ష మొక్కటి రేగి నాసికా
పుటముల బుస్స లూర్చుచు ప్రభూత రజమ్ముల చిమ్ముచున్ మరు
త్కటముల గొమ్ములొడ్డి విటతాటము గ్రుమ్ముచు గాలశూల ని
ర్ఘటమగు వాలమెత్తి పయిపై బఱతెంచుచునున్న నయ్యెడన్

నిలునిలు డోహో తల తల
దులుకున పుంగవము దూకు చున్నది గను గ్రే
వల నిప్పులుమియుచు ధరా
తలమున ఒన్నుండి ముప్పు దాటదె పూజ్యా!



డి. పశుపతి; గాత్రం (విజయవాడ, జనవరి 6)

అనుచున్ సనాళ పద్మం
బనకే లెత్తి యెలుగెత్తి యార్చుచు గరుణా
జనిరైన యొక్క భిక్షువు
గనుకని చని వాని తనదు కౌగిట బొదివెన్

బలియు డెవ్వడో కొమ్ముపట్టి తన్ను నిలువరించిన యోజపేరెమ్ము ఉడిగి
కోరచూపులలోన గోరాడు రోసమ్ము రోడిగిల్లిన భాతి యోర్మి మెలసి
ముకుగోళ్ళ వెలివాఱు బుసబుసల్ తుడిచివై చెడిరీతి నాల్కతో సెలవి నాకి
తనువుపై మూగిన దంశంబులనుఁ జోపు కొనుభంగి వాలవీజనము వార్చి.

వృద్ధు బెనచిన మెనుమూపు పుద్ధిపటుపు
పొంత కేతెంచి భిక్షువు మూపునానుచు
వఱపు మెడవంచి చిఱువాకె వైచి మోపి
సాచి కరువో యనంగ గోస్వామి నిలిచె

అన్నన్నా నీకిది తగు
నన్నా? పంగ్వంధు లార్తులను దేరగ యీ
సన్నాహము లొప్పునే నీ
కెన్నండును లేని చేష్ట లేలా పొడమెన్ !

అని యిటు పారికాంక్షి వినయం బెటిగించుచు బుజ్జవమ్ము నె
క్కొన నిడు గంగడోలుకొనగోళుల దువ్వుచు శాంతి గూర్చి దే
యని యదలించివచ్చిన హిమాలయ జంగమధౌత శృంగమో
యన నలనల్లనం జనియె నా నృపరాజము తానే మెర్చుచున్

గోరాడగ వచ్చిన యా
గోరాజును నెట్లు వీడుకొల్పిన వాడై
ధారాధర ఘోషంబున
కారుణ్యము గురియ వృద్ధు గనుగొని పలికెన్

అయ్యా తా రెవ్వరు? పే
రెయ్యది? యెందుండి రాక! యే కార్యార్థ
మియ్యెడ కేతేరంగా
నయ్యెనో? ఈ తోడులేని యాత్రలు వింతల్

బలము కలుగుగాక తలపు పొడము గాక
ఊతకోల చేత నుండుగాక
వార్ధకమ్ము ప్రేటుపడని మేక మయారె
ఇట్టి సాహసమ్ము లెట్లు పొడమె!

కలుగరె తమ్ములో సుతులో గాదిలి చుట్టములో తలంచనె
చ్చలులో వలంతి సేవకులో శిష్యగణములో యీ దరిత్రి యె
త్తులునడి సత్కృపారసము దోహనముల్ మటుమాయ మయ్యెనే
వలపలనైన మేని పస వానిని నొంటిగ నిట్లు పుత్తురే

(తరువాయి 47-వ పేజీలో)



సంక్రాంతి సంజె గొబ్బి

చిత్రకారుడు వెల్లటూరి పూర్ణానంద శర్మ

# సంక్రాంతి ప్రత్యేక కార్యక్రమాలు

భోగి, సంక్రాంతి, కనుము—ఈ మూడు ముఖ్యపండుగ దినాలు ఆంధ్రుల జాతీయ జీవనంలో ప్రాధాన్యత వహించినవి. సంక్రాంతి పురస్కరించుకొని ఆకాశవాణి వివిధ కేంద్రాలు ఏర్పాటుచేసిన కార్యక్రమాలు క్రింద పొందుపరుపబడినవి

## హైదరాబాద్

జనవరి 11 శ॥ మ॥ 12-30 గొబ్బిళ్లు
సంక్రాంతి పండుగపై రూపకం

„ „ „ 3-30 ముత్యాల గొబ్బి
సంక్రాంతిపై కదంబ కార్యక్రమము

„ „ సా॥ 6-30 సంక్రాంతి శోభ రూపకం
రచన ఎమ్. ఆర్. అప్పారావు

## విజయవాడ

జనవరి 13 శు॥ మ॥ 1-00 సంక్రాంతి పండుగ
కదంబ కార్యక్రమము
సమర్పణ సుభద్రా శ్రీనివాసన్

„ 14 శ॥ ఉ॥ 6-10 ఆదిత్యస్తుతి
శ్రీ వెంకటేశ్వర సుప్రభాతం

„ „ „ „ 7-30 సంక్రాంతి సరదాలు
కదంబ కార్యక్రమము
సమర్పణ: ఏడిద కామేశ్వరరావు

„ „ „ సా॥ 5-30 సంక్రాంతి పాటలు
సమర్పణ. ప్రయాగ నరసింహశాస్త్రి

## మద్రాస్

జనవరి 13 శు॥ మ॥ 2-00 పొట్టి ప్లీడరు
(మద్రాస్-బి)
రేడియో సంక్షిప్త శబ్ద చిత్రం
సమర్పణ: రేఖా అండ్ మురళీ ఆర్ట్స్

„ 14 శ॥ రా॥ 7-15 వేణీ సంహారం నాటిక
(మద్రాస్-బి)
రచన: యామిజాల పద్మనాభస్వామి

# ఆమ్రపాలి ఆత్మార్పణం

కరుణశ్రీ

[బుద్ధ భగవానుడు శిష్యసమేతంగా వైశాలీ నగరానికి విజయం చేశాడు. రాజనర్తకి ఆమ్రపాలి ఆనందంతో స్వామికి స్వాగతమిచ్చింది. ఆ ఆనంద పారవశ్యంలో ఆమెలో పొంగిన భక్తి తరంగాలే ఈ కవితా నాట్యతరంగాలు.]

ఇంత తీయగా చిగిర్చింది ఎందుకో ఈ ఉదయం
ఇంత హాయిగా నిట్టూర్చింది ఎందుకో నా హృదయం
ఎంతో సంతోషంతో ఎగిరెగిరి దుముకుతున్నవి తురంగాలు
అంతరంగం ముంచెత్తుతున్నవి ఏవేవో భావ తరంగాలు.

శాక్య రాజ్యస్వామి జాయ మాయాదేవి
శోకోత్తరమ్మయిన లుంబినీ వనములో
కడుపు చల్లగ కన్న కల్యాణముల పంట
కాలూను నంట వైశాలి నర్తకి యింట.

చిరునవ్వులో పారిజాతాలు పూచిన కరుణారస సింధువు
చరణాలలో కోటి స్వర్గాలు దాచిన శరణాగత బంధువు
అరుదెంచుచున్నాడు నేడు ఆపన్న విపన్నివర్తకుడు
దయచేయుచున్నాడు నేడు ధర్మచక్ర ప్రవర్తకుడు.

కఠిన కర్కశ శరాఘాతమ్ముచే కూలి
ప్రాణాలు రాయంచ కుయ్యాలించి లాలించి
రక్షించు అక్షీణ దాక్షిణ్యముల పంట
కాలూను నట వైశాలి నర్తకి యింట.

నా ప్రభువు నా కరుణమూర్తి నన్ను మన్నించినాడు
నా ప్రార్థన ఆలకించాడు నా పిలుపు అంగీకరించాడు
ఎందరెందరో కోటీశ్వరులు తమ మందిరాల కాహ్వానించారు
అందరినీ కాదని ప్రభువు ఈ ఆమ్రపాలినే అనుగ్రహించాడు.

రాజ్యమ్ము ప్రణయ సామ్రాజ్యము విడనాడి
తళుకు చెక్కిళ్ళ ముద్దుల నందనుని వీడి
కదలిపోయిన విశ్వకారుణ్యముల పంట
కాలూను నంట వైశాలి నర్తకి యింట.

మధుర మధురంగా పులకిస్తున్నది నా మామిడి తోట
మధువు లొలికిస్తున్న దీనాడు నా మల్లెపువ్వుల బాట
కొమ్మ కొమ్మనా గుమ్మటాలై క్రొత్త చిగుళ్ళు లేస్తున్నవి
కమ్మకమ్మగా కోకిలమ్మలు కంఠమెత్తి కూస్తున్నవి.

కదలి మహాభినిష్క్రమణంబు సాగించి
పల్లెపిల్ల సుజాత పాయసమ్ము భుజించి
బుద్ధత్వమును గన్న బోధివృక్షము పంట
కాలూను నంట వైశాలి నర్తకి యింట.

నా మానసం మానస సరస్సులా మారుతున్నది
నా భావన సహస్ర పత్రకమలమై తేలుచున్నది
నా అనురాగం సుకుమార సుగంధమై దెసల ప్రసరిస్తున్నది
నా ఆనందం మధుర మకరందమై పొంగి ప్రవహిస్తున్నది.

కన్నీటితో జగత్కాలుష్యమును గడిగి
శాంతి కలహంసలకు కాంతిరెక్కలు తొడిగి
అజ్ఞానముల నణచు విజ్ఞానముల పంట
కాలూను నంట వైశాలి నర్తకి యింట.

తథాగతులు మా యింటికి దయతో విజయం చేస్తారట
సుధాకరులు ఈ కలువను చూడటానికి వస్తారట
నా జీవనం వనమయూరమై నవోల్లాసంతో నర్తిస్తున్నది
నా యౌవనం తన పవిత్ర కర్తవ్యాన్ని నవనవంగా గుర్తిస్తున్నది.

ఆటకు కత్తులు పెటికి కంఠాలు తెగనటికి
ప్రజల నెత్తురు త్రాగు గజదొంగలను గూడ
సాధువులుగా మార్చు సౌహార్దములపంట
కాలూను నంట వైశాలి నర్తకి యింట,

చక్కని కలహంసలా వెండిరెక్కలు తొడుక్కున్నది శరత్తు
చిక్కని మధుపరాగాలు చిమ్ముతున్నది మలయమరుత్తు
పరవశించి పొంగి పొరలుతూ పరువెత్తి వస్తున్నది సరిత్తు
నిరవధికంగా నిర్నిమేషంగా నిలిచి చూస్తున్నది వియత్తు.

మూగప్రాణుల బంధ మోక్షణమ్మొందించి
యాగవేదికల వాగమృతమ్ము చిందించి
సర్వార్థ సిద్ధమౌ సౌజన్యముల పంట
కాలూను నంట వైశాలి నర్తకి యింట.

విచ్చేస్తాడు నేడు నా యింటికి విశ్వశాంతి ప్రదాయకుండు
వెలుగు నిస్తాడు నా కంటికి విజయ మంగళ విధాయకుడు
నా అదృష్టం గజ్జెకట్టి నాట్యం చేస్తుం దీనాడు
శాంతరసాన్ని శృంగారం శరణు పొందుతుంది నేడు

ఆ ప్రభువు చూపు తాపత్రయ మ్మెడబాపు
ఆ దయామయు మాట అపవర్గముల మూట
సర్వతోభద్రమౌ శాంత్యహింసల పంట
కాలూను నంట వైశాలి నర్తకి యింట,

జగద్గురువులకీ రాజనర్తకి స్వాగతమిస్తుంది నేడు
జన్మజన్మాల సాధన సార్థకమౌతుం దీనాడు
గగనం పుష్పవృష్టి కురుస్తుంది కరగి నీరౌతుంది భూమి
పూజలందుకుంటాడు నా స్వామి బుద్ధం శరణం గచ్ఛామి.

సంసార దుఃఖ హరణాలు చైతన్య పరిస్ఫురణాలు
శాంతిదేవత కలంకరణాలు సౌభాగ్య సమవతరణాలు
అజ్ఞాన తమస్సులణచు అహస్కరుని కిరణాలు
శాక్యసింహుని శ్రీచరణాలు సర్వదా నాకు శరణాలు.

# ప్రసార విశేషములు

## అఖిల భారత సంగీత కార్యక్రమము

అఖిలభారత సంగీత కార్యక్రమంలో షకూర్ ఖాన్ సారంగియు, కరమతుల్లా ఖాన్ తబ్లాయు, వాయించుటను జనవరి 7-వ తేదీ రాత్రి 9-30 గంటలకు వినవచ్చును.

జనవరి 14-వ తేదీన శ్రీ వోలేటి వెంకటేశ్వర్లుగారి గాత్ర సంగీతమును వినవచ్చును.



వోలేటి వెంకటేశ్వర్లు జనవరి 14)

★



షకూర్ ఖాన్; సారంగి (జనవరి 7)

## మోహినీ భస్మాసుర

[రేడియో సంక్షిప్త శబ్ద చిత్రం]

ఎవరి తలపైన చేయి పెట్టిన వారు భస్మమగునట్లు వరమును పొందిన భస్మాసురుడు, ఆ వరమును సద్వినియోగము చేసికొనక దుర్వినియోగము చేయును. అపుడు దేవుడే మోహిని రూపమున ప్రత్యక్షమై- ఒక వలపన్ని, ఆ దురాత్ముని నాశమునకు కారణభూతుడగును. మోహినీ భస్మాసుర సంక్షిప్త శబ్ద చిత్రమును హైదరాబాద్ కేంద్రమునుండి జనవరి 15-వ తేదీ ఆదివారం మధ్యాహ్నం 3 గంటలకు వినవచ్చును.

## గాలిపటము

[రూపకము]

భోగి, సంక్రాంతి పండుగ సందర్భములలో గాలిపటముల నెగురవేయుట పిల్లల కొక సరదా. ఈ గాలిపటము ఎగురవేయుటపై రూపకమును జనవరి 8-వ తేదీ మధ్యాహ్నం 2-20 గంటలకు 'బాలవినోదం' పిల్లల కార్యక్రమములో హైదరాబాద్ కేంద్రమునుండి వినవచ్చు.

## మన భోజన పదార్థాలు—మార్పులు

మనము ఆరోగ్యముగా జీవింపవలెనన్న ఆహారము ముఖ్యము. మనం తీసుకొను ఆహారము మన వయస్సు, దేహస్థితి, మనము చేయు పనులనుబట్టి యుండును. మనకు ఏ ఆహార ధాన్యము దొరుకునో దానినే మనము వినియోగించుకొనవలయును, ఏ వస్తువులు మనకు అందుబాటులో నున్నవో వాటినే సమయోచితముగ ఆహార పదార్థములుగా వినియోగించుటయే మన ప్రతి ఒక్కరి కర్తవ్యము. 'మన భోజన పదార్థాలు-మార్పులు' అను విషయంపై శ్రీ వేటూరి శంకరశాస్త్రి, జనవరి 4-వ తేదీ రాత్రి 9-30 గంటలకు విజయవాడ కేంద్రమునుండి ప్రసంగించెదరు. ఈ కార్యక్రమాన్ని హైదరాబాద్, కడప, విశాఖపట్నం కేంద్రాలనుండిగూడ వినవచ్చును

## పొట్టిబావ పాదయాత్ర

చిన్నపిల్లల హాస్య కథానాయకుడగు పొట్టిబావ, న్యూఢిల్లీలో ప్రజాప్రభుత్వ దినోత్సవమునకు హాజరగుటకు నిశ్చయించుకొనును. ఆర్థిక సమస్యల నెరిగిన చిట్టిమరదలు అతనిని వెళ్ళవద్దని వారించును. కాని పొట్టిబావ హైదరాబాద్ నుండి న్యూఢిల్లీకి పాదయాత్ర సాగించుటకు నిశ్చయించుకొనును. అతడు ప్రయాణమును ముగించునా? ఎన్. రాఘవరావు రచించి, సమర్పించుచున్న "పొట్టిబావ పాదయాత్ర" అను హాస్యనాటికను జనవరి 15-వ తేదీ ఆదివారం మధ్యాహ్నం 2-20 గంటలకు పిల్లల కార్యక్రమములో హైదరాబాద్ కేంద్రమునుండి వినవచ్చు.

## ప్రజాస్వామ్యము—దాని సద్వినియోగము

గ్రామములో మనకు కొన్ని సౌకర్యములు కావలెనన్న, మన తరపున, ఆ సౌకర్యాలను గూర్చి పై అధికారులకు చెప్పు పెద్ద మనిషిని, మనము గ్రామ అధికారిగా ఎన్నుకొనవలెను." ప్రజాస్వామ్య మన నిదియే ప్రజాస్వామ్యము-దాని సద్వినియోగముపై అవుల సాంబశివరావు, హైదరాబాద్ కేంద్రమునుండి జనవరి 10-వ తేదీ రాత్రి 7-45 గంటలకు ప్రసంగించెదరు



కరమతుల్లాఖాన్; తబ్లా (జనవరి 7)

# ప్రసార విశేషాలు



## లేత మనసులు

[రేడియో సంక్షిప్త శబ్ద చిత్రం]

చిత్ర నిర్మాత: ఎ. వి. మెయప్పన్
(ఎ. వి. ఎమ్. ప్రొడక్షన్స్)
దర్శకత్వం: కృష్ణన్ పంజు
మాటలు: డి. వి. నరసరాజు
పాటలు: దాశరథి, ఆరుద్ర
సంగీతం: ఎమ్. ఎస్. విశ్వనాథన్

నటీనటవర్గం:
జమున, జి. వరలక్ష్మి, దేవీ పద్మిని. కనకం, గీతాంజలి, మణిమాల, వి.ఆర్. తిలకం, హరనాథ్, రేలంగి, పద్మనాభం, మున్నగువారు.

రేడియో పరిచాలన: వాస్రేవు పురుషోత్తం

ఒకరి నొకరు ప్రేమించుకొని జీవితములో అడుగు పెట్టిన నవదంపతులు సత్యభామ, శేఖర్‌లకు కవల పిల్లలు పుడతారు. పేర్లు లలిత, పద్మిని, ముద్దుగా లల్లీ, పప్పీ అని పిలుచుకుంటూంటారు.

భామ (సత్యభామ) తల్లి కనకదుర్గమ్మ గారి అహంకారము, దర్పము, శేఖర్ గౌరవాభిమానాలను గాయపరుస్తాయి. ఇంటినీ ఉద్యోగాన్నీ వదిలిపోవడానికి నిశ్చయించుకుంటాడు. కాని, భార్య తటపటాయించడంతో కవల పిల్లలలో పప్పీని మాత్రం వెంటతీసుకొని రంగూన్ వెళ్ళి, అక్కడ ఐశ్వర్యవంతుడై తిరిగి వస్తాడు.

విధివశాత్తూ లల్లీ, పప్పీ ఒకే బడిలో చదువుకుంటూ ఎప్పుడూ కీచులాడుకుంటూంటారు. కాని, ఒక రోజు పిక్నిక్‌లో వారిద్దరికీ సఖ్యం కుదురుతుంది, తమ యిద్దరి తల్లిదండ్రులూ ఒకరేననీ, తాము అక్కచెల్లెళ్ళమనీ తెలుసుకుంటారు.

పంతాలతో, పట్టుదలలతో దూర దూరంగా వుంటున్న తల్లిదండ్రులను కలపాలనీ, యిద్దరూ కలిసి పథకం వేస్తారు. తల్లి అంటే యెరుగని పప్పీ తల్లి దగ్గరికి, తండ్రి అంటే యెరుగని లల్లీ తండ్రి దగ్గరికి వెళతారు. చివరకు పిల్లల పథకం నెరవేరి, పంతాలు పోయి భామ, శేఖర్‌లు ఏకమవుతారు.

ఎ. వి. ఎమ్. ప్రొడక్షన్స్‌వారి 'లేత మనసులు' రేడియో సంక్షిప్త శబ్దచిత్రం జనవరి 1-వ తేదీ ఆదివార సాయంత్రం 3 గంటలకు ఆకాశవాణి హైదరాబాద్, విజయవాడ కేంద్రాలనుండి వినవచ్చును.

## భక్తపోతన

[రేడియో సంక్షిప్త శబ్ద చిత్రం]

నిర్మాతలు: భారత్ ఫిలిమ్స్
దర్శకత్వం: రామినీడు
రచన: సముద్రాల
సంగీతం: ఎస్. రాజేశ్వరరావు

తారాగణం:
గుమ్మడి, ఎస్. వి. రంగారావు, అంజలీదేవి, హరనాథ్, బాలయ్య, చలం, మిక్కిలినేని, వాసంతి, శారద, జయశ్రీ, ప్రభాకరరెడ్డి, మున్నగువారు.

రేడియో పరిచాలన: 'శుభ'

భక్తపోతన రేడియో సంక్షిప్త శబ్ద చిత్రం జనవరి 8-వ తేదీ ఆదివారం మధ్యాహ్నం 2 గంటలకు మద్రాస్ కేంద్రం నుండి వినగలరు.

## త్యాగరాజనుత

[రూపకం]

కీర్తిగాంచిన త్యాగరాజుని 200-వ జన్మదినోత్సవ సందర్భమున విజయవాడ కేంద్రము త్యాగరాజ కృతులపై "త్యాగరాజనుత" అను రూపకమును సమర్పించుచున్నది. శ్రీమతి సుభద్రా శ్రీనివాసన్ రచించిన ఈ రూపకమును జనవరి 6-వ తేదీ మధ్యాహ్నం 1 గంటకు స్త్రీల కార్యక్రమములో వినవచ్చును. ఇందు కుమారి శ్రీరంగం గోపా రత్నం, కుమారి వింజమూరి లక్ష్మి, కుమారి వి. బి. కనకదుర్గ గారలు త్యాగరాజ కృతులను ఆలాపించెదరు. ఈ కార్యక్రమాన్ని హైదరాబాద్ కేంద్రంనుండి గూడా వినవచ్చును.



సంక్రాంతి ప్రత్యేక కార్యక్రమము

## వేణీ సంహారం

[నాటిక]

(భట్టనారాయణుని సంస్కృత కృతికి శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారి అనువరణ.)

పాల్గొనువారు :
ధూళిపాళ సీతారామశాస్త్రి
మాధవపెద్ది సత్యం
కాకరాల
ఏడిద నాగేశ్వరరావు
డి. నారాయణ
కొల్ల సత్యం, ఉమ, మల్లిక్
సిహెచ్. వి. హనుమంతరావు
టి. ఆర్. జయదేవ్
వి. వి. తాతాచారి, బి. లక్ష్మీపతి
కె. ఉదయలక్ష్మి, ఎస్. లక్ష్మీకుమారి
పి. భానుమతి, జి. వైదేహి
కుమారి వై. లక్ష్మి

నిర్వహణ: దాశరథి

ఈ నాటకం ఆకాశవాణి మద్రాస్ కేంద్రంనుండి జనవరి 14-వ తేదీ రాత్రి 7-30 గంటలకు వినవచ్చును.

## ధన్యజీవి—శాస్త్రిజీ

ఆకాశవాణి విజయవాడ కేంద్రము శాస్త్రీజీ ప్రథమ వర్ధంతి సందర్భమున అనేక కార్యక్రమాలను ఏర్పాటుచేసి యున్నది. జనవరి 11-వ తేదీ రాత్రి 7-15 గంటలకు శ్రీ ఎస్. వి. శేషయ్య 'ధన్యజీవి—శాస్త్రీజీ' అను విషయంపై ప్రసంగించెదరు. అదే కార్యక్రమమున శ్రీ వి. శివరామారావు, కె. రామభద్రరావు గారలు శాస్త్రీజీపై రచించిన శ్రద్ధాంజలి గీతాలను వినవచ్చును. రాత్రి 7-45 గంటలకు శ్రీ బందా కనకలింగేశ్వరరావుగారు సమర్పించు శాస్త్రీజీ జీవితముపై రూపకమును వినవచ్చును.

మధ్యాహ్నం 1 గంటకు స్త్రీల కార్యక్రమములో 'ఆదర్శ గృహస్థుడు శాస్త్రీజీ' అనువిషయంపై ప్రసంగమును వినవచ్చును. శాస్త్రీజీ ప్రసంగముల నుండి కొన్ని ఘట్టాలతో కూడిన 'శాస్త్రీజీ—ఆదర్శాలు' అను కార్యక్రమమును రాత్రి 8-15 గంటలకు వినవచ్చును.




ఎ. ఎస్. ప్రసన్నకుమారి, గాత్రం (బెంగుళూర్, జనవరి 3)

## మద్రాస్-సి

(వివిధ భారతి)

193.5 (1550 కిలోసై)

వారములో అన్ని రోజులు (శనివారం మినహా)

ఉ॥ 7-00 నుండి 9-30

10-15 నుండి 12-30

మ॥ 2-00 నుండి 5-30

సా॥ 6-30 నుండి 10-40

(శనివారములు మాత్రం రాత్రి 6-30 నుండి 11-10)

[వివరాలు 48-వ పేజీలో]

## హైదరాబాద్-సి

వివిధభారతి (రిలే)

ఉ॥ 7-00 నుండి 9-30

10-15 నుండి 12-30

మ॥ 2-00 నుండి 5-30

సా॥ 6-30 నుండి 10-35

(శనివారములు మాత్రం రాత్రి 6-30 నుండి 11-10)

[వివరాలు 48-వ పేజీలో]

## తిరుచ్చి-బి

202.7 మీ (1480 కిలోసై)

వివిధభారతి (రిలే)

ఉ॥ 7-00 నుండి 9-30

10-15 నుండి 12-30

మ॥ 2-00 నుండి 5-30

సా॥ 6-30 నుండి 10-40

(శనివారము సా॥ 6-30 నుండి రా॥ 11-10 వరకు)

[వివరాలు 48-వ పేజీలో]

## దేశరక్షణ: ప్రత్యేక వార్తా ప్రసారాలు

ప్రతిదినము ఉదయం 8-40 ప్రత్యేక వార్తా ప్రసారము

(ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారమగు ఈ కార్యక్రమము మద్రాస్-బి, హైదరాబాద్, విజయవాడ, తిరుచ్చి, బెంగుళూర్ కేంద్రములు రిలే చేస్తాయి.)

వారంలో శనివారము తప్ప మిగతా రోజులలో

ప్రతిరోజూ రా॥ 10-30 గంటలకు ప్రత్యేక వార్తా ప్రసారము

శనివారం రా॥ 11-00 ప్రత్యేక వార్తా ప్రసారము

ఢిల్లీ కేంద్రమునుండి ప్రసారమగు పై రెండు కార్యక్రమాలు హైదరాబాద్, విజయవాడ, తిరుచ్చి, బెంగుళూర్, కేంద్రములు రిలే చేస్తాయి.

## వివిధ భాషలలో వార్తా ప్రసారాలు

### తెలుగు

ఉ॥ 7-00 నుండి 7-15 వరకు

మ॥ 1-50 నుండి 2-00 వరకు

సా॥ 7-00 నుండి 7-15 వరకు

### హిందీ

ఉ॥ 8-15 నుండి 8-30 వరకు

మ॥ 1-40 నుండి 1-50 వరకు

రా॥ 8-15 నుండి 8-30 వరకు

రా॥ 10-35 నుండి 1-40 వరకు

### ఆంగ్లం

ఉ॥ 6-40 నుండి 6-45 వరకు

ఉ॥ 8-00 నుండి 8-15 వరకు

మ॥ 1-30 నుండి 1-40 వరకు

సా॥ 6-00 నుండి 6-05 వరకు

రా॥ 9-00 నుండి 9-15 వరకు

రా॥ 10-30 నుండి 10-35 వరకు

### తమిళం

ఉ॥ 7-15 నుండి 7-30 వరకు

మ॥ 2-00 నుండి 2-10 వరకు

రా॥ 7-15 నుండి 7-30 వరకు

# ఆదివారం జనవరి 1

శక 1888 పుష్య 11

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I
405.4 మీ (740 కిలోసై)

6.00* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరణ
6.10 భక్తిరంజని (విజయవాడనుండి రిలే)
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తిముక్తావళి
6.50 వాద్యగోష్ఠి
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీత శిక్షణ (విజయవాడనుండి రిలే)
7.30 అమరవాణి
కఠోపనిషత్తు: అధ్యాత్మ విద్య ప్రసంగం
డా॥ బి. ఆర్. శాస్త్రి
7.45 సుగం సంగీత్
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 సంగీతామృతం: టి. కె. రంగాచారి
9.30 వాతావరణ సూచన, సర్గం
10.00 మరాటీ శ్రోతలకు
10.30 కన్నడ శ్రోతలకు
11.00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.30* బచ్చోంకేలియే
1.00 రంగవల్లి
స్వాగతం — పాట
గడచిన రోజులు — ప్రసంగం
శ్రోతల లేఖలు
ఇష్టాగోష్ఠి
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 చిత్రపట్ సే†
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, లలిత సంగీత్
2.10 ఉర్దూలో వార్తలు
2.20 బాలవినోదం
పిలుపుపాట
ఒకరోజు రాణి — నాటిక
తారీఖులు ఎందుకు వచ్చాయి — ప్రసంగం
మీ ఉత్తరాలు, అవీ, ఇవీ
3.00 లేతమనసులు — సంక్షిప్త శబ్ద చిత్రం
సమర్పణ: ఎ. వి. ఎమ్. ప్రొడక్షన్స్
నిర్వహణ: వి. పురుషోత్తం
4.00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5.30* స్థానిక ప్రకటనలు
5.35 విజయవాడ వలె
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ)
6.25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6.30 వ్యావసాయిక విషయాలు
గ్రామకచ్చేరి — సంభాషణ
భారతదేశము-ప్రజాస్వామ్యము — ప్రసంగం
వాతావరణము
7.00 తెలుగులో వార్తలు
7.15 దీక్ష
7.30 సమస్యాపూరణం
7.45 మన తత్త్వ శాస్త్రము-మన నిత్యజీవితం ప్రసంగం
డి. శ్రీధరబాబు
7.55 విరామ సంగీతం
8.00 Training in marketing and export management talk by T. A. A. Latif
8.10 విరామ సంగీతం
8.15 ఈమాసపు పాట: ఎమ్. బాలమురళీకృష్ణ
8.20 నగరవాణి
8.30 చిత్రసీమ†
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 ఉర్దూలో వార్తలు
9.30 ప్రసంగం (ఉర్దూ)
9.40 శ్రోతల ఉత్తరాలకు జవాబులు (ఉర్దూ)
9.45 నాటిక (ఉర్దూ)
10.15 బెంగాలీబాయ్
10.30 హైదరాబాద్ బి వలె
11.50 హిందీలో వార్తలు
11.55 ఆంగ్లములో వార్తలు
12.00 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

## కడప

333.3 మీ (900 కిలోసై)
సా॥ 5.30 నుండి రా॥ 10.40 వరకు
శనివారములు మాత్రము
సా॥ 5.30 నుండి రా॥ 11.10 వరకు

## విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)
సా॥ 5.30 నుండి రా॥ 10.40 వరకు

ఉ॥ ప్రసారము I
[హైదరాబాద్ మాత్రమే]
89.42 మీ (3355 కిలోసై)

6.00* హైదరాబాద్ ఎ వలె
7.45 ప్రసార సమాప్తి

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.00* వందేమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6.10 భక్తిరంజని: వెంకటాద్రిస్వామి కీర్తనలు, రామాయణ గానసుధ
6.40 ఆంగ్లములో వార్తలు
6.45 సూక్తిముక్తావళి
6.50 బజారు ధరలు
6.55 విరామ సంగీతం
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీత శిక్షణ (సీనియర్లకు)
7.30 అమరవాణి
సంస్కృత కార్యక్రమము (హైదరాబాద్ నుండి రిలే)
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 హిందీలో వార్తలు

---

ప్రసారము I (తరువాయి)
62.50 మీ (4800 కిలోసై)

8.00 హైదరాబాద్ ఎ వలె
9.30* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.30* బి. సరోజినీదేవి
1.00 హైదరాబాద్ ఎ వలె
2.10 వాద్య సంగీతం†
2.20 హైదరాబాద్ ఎ వలె
4.00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
62.50 మీ (4800 కిలోసై)

5.30* హైదరాబాద్ ఎ వలె
7.00 తెలుగులో వార్తలు
7.15 హైదరాబాద్ ఎ వలె
8.00 సంగీతోత్సవము (మద్రాస్ నుండి రిలే)
9.00 హైదరాబాద్ ఎ వలె
9.15 In the News
9.20 విరామ సంగీతం
9.30 సంగీతోత్సవము (మద్రాస్ నుండి రిలే)
11.50 హైదరాబాద్ ఎ వలె
12.00 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

8.30 బొమ్మరిల్లు
రారండి రారండి
మనపాట
తపాలాసంచి
యేడాదికథ — రూపకం
అవీ, ఇవీ, సెలవు
9.15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.30 రామవరపు సుబ్బారావు: వీణ
1.00 రంగవల్లి (హైదరాబాద్ నుండి రిలే)
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 హిందీలో వార్తలు
1.50 తెలుగులో వార్తలు
2.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

3.00 లేతమనసులు — సంక్షిప్త శబ్ద చిత్రం (హైదరాబాద్ నుండి రిలే)
4.00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5.30* స్థానిక ప్రకటనలు
5.35 కుశలవ జననం — కథాకాలక్షేపం
జి. శ్రీరామమూర్తి
6.00 ఆంగ్లములో వార్తలు
6.05 వాద్య బృందము
6.15 ప్రాంతీయ వార్తలు
6.25 ముఖ్య ప్రకటనలు, విరామ సంగీతం
6.30 పంట సీమలు
7.00 తెలుగులో వార్తలు
7.15 దీక్ష
7.30 నరసవినోదిని. సమస్యాపూరణం
7.45 మన సంస్కృతి స్రవంతి — ప్రసంగం
7.50 చిత్రతరంగిణి-ఫిల్మీ సంగీతం†
8.00 సంగీతోత్సవము (మద్రాస్ నుండి రిలే)
9.00 ఆంగ్లములో వార్తలు
9.15 In the News
9.20 విరామ సంగీతం
9.30 సంగీతోత్సవము (మద్రాస్ నుండి రిలే)
10.30 ఆంగ్లములో వార్తలు
10.35 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
వివరాలు 48-వ పేజీలో]



* సమయసూచన    † గ్రామఫోన్ రికార్డ్    ‡ స్టూడియో రికార్డింగ్

ఆదివారం జనవరి 1

శక 1888 పుష్య 11

## మద్రాస్-ఎ

416.7 మీ (720 కిలోసైకిల్స్)
ఉ॥ 6-00 నుండి 11-00 వరకు
మ॥ 11-55 నుండి రా॥ 12-00 వరకు
60.98 మీ (4920 కిలోసైకిల్స్)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
41.90 మీ (7160 కిలోసైకిల్స్)
మ॥ 11-55 నుండి సా॥ 4-30 వరకు
60.98 మీ (4920 కిలోసైకిల్స్)
సా॥ 6-40 నుండి రా॥ 11-00 వరకు

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, మంగళగానం
6-05 తిరుప్పావై, తిరువెంబావై
6-20 తుదిప్పాడల్‌గళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ
వాతావరణ సూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 బజారు ధరలు
6-50 ఒలిమిగు భారతం
6-55 వాద్యగోష్ఠి
వేణువు: నిలయవిద్వాంసుడు
7-15 తమిళములో వార్తలు
7-30 అహింసయిన్ కురళ్
7-35 చిత్రగానం
8-00 మెల్లిసై: పి. సుశీల
8-15 ఎస్. నరసింహులు
వి. గోవిందస్వామి నాయకర్: వయొలిన్
మద్రాస్ ఎ. కన్నన్: మృదంగం
కె. నారాయణస్వామి: ఘటం
9-15 చిత్తిర అరంగం
9-45 మీనాక్షి కల్యాణం
సంగీతోపన్యాసం
ఉడయలూర్ ఎ. రాజగోపాలశర్మ
10-30 మధురగీతం
10-55 ఆంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ శెయిదిగళ్
12-00 కీర్తనమాలిక‡
12-30 సూర్యకాంతి
1-00 ఆర్. ఎమ్. సుందరం
1-30 వాద్యగోష్ఠి
1-45 చిత్రగానం†
పడగోట్టి
1-55 వాతావరణ సూచన,
2-00 తమిళములో వార్తలు
2-10 పాపామలర్ పిల్లలకు
3-00 శ్రోతలు కోరిన పాటలు
3-30 నాటిక (తమిళం)
4-30 జి. వైదేహి
5-30 వీణ: నిలయవిద్వాంసుడు
6-00 విరామ సంగీతం
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 సంగీతోత్సవము
(మద్రాస్ నగరంలో జరిగిన సంగీత కచేరీలనుండి కొన్ని ఘట్టాలు)
7-15 తమిళములో వార్తలు
7-30 వ్యవసాయదారులకు
(తిరుచ్చినుండి రిలే)
8-00 సంగీతోత్సవము
(మద్రాస్ నగరంలో జరిగిన సంగీత కచేరీలనుండి కొన్ని ఘట్టాలు)
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ప్రసంగము (తమిళం)
9-30 సంగీతోత్సవము
(మద్రాస్ నగరంలో జరిగిన సంగీత కచేరీలనుండి కొన్ని ఘట్టాలు)
11-55 ఆంగ్లములో వార్తలు
12-00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I
211.3 మీ (1420 కిలోసైకిల్స్)
ఉ॥ 9-30 నుండి 10-30 వరకు
41.90 మీ (7160 కిలోసైకిల్స్)

6-00 మద్రాస్ ఎ వలె
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 విరామ సంగీతం †
6-50 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 మెల్లిసై: అంజలిగీతం
7-30 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 మద్రాస్ ఎ వలె
8-45 ఆటవిడుపు
పిలుపుపాట
కొత్త మెంబర్లు
కుంటి వేమన నాటిక
పాట నేర్చుకో
దూరదేశములలోని బాలలు: నార్వే
పుట్టినరోజు పండుగలు
ఉత్తరాలకి జవాబులు
చిక్కు ప్రశ్న
పొడుపు
9-30 కళారంగం
10-00 హుమళె (కన్నడం)
10-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసైకిల్స్)

11-55 మద్రాస్ ఎ వలె
1-00 Pop session†
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 మేల్కొన్నది రాయగడ దుర్గం నాటిక
మరాటీ మాతృక: వసంత్ కనేకర్
తెలుగుసేత: ఎమ్. మంగతాయారు
3-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసైకిల్స్)

5-30* Wolfgang Fortner†
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-15 విరామ సంగీతం†
6-20 వాతావరణ సూచన,
స్థానిక ప్రకటనలు,
వాణిజ్య వార్తలు,
కార్యక్రమ వివరణ
6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 వాద్య సంగీతం: వీణాయుగళం
7-30 గీతమాలిక
8-00 మద్రాస్ ఎ వలె
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 In the News
9-20 విరామ సంగీతం
9-30 Current affairs
10-00 Cincinnati Symphony orchestra conducted by Max Rudolph
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన,
జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసైకిల్స్)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

## బెంగుళూరు

ఉ॥ ప్రసారము I
491.8 మీ (610 కిలోసైకిల్స్)

6-30* వందేమాతరం,
మంగళధ్వని, సుప్రభాత,
విచార దీప్తి
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
7-10 వాద్యశ్రీ†
7-15 రసమంజరి
7-30 కన్నడ గీతావళి
7-40 బజారు ధరలు
7-45 కన్నడములో వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 రాబోయే కార్యక్రమముల వివరణ
8-30 కె. రమాదేవి: వీణ
9-30* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
(బెంగుళూరు మాత్రమే)

12-00* Western Music†
12-30 బాలజగత్
1-00 చిత్రగీతె†
1-10 కన్నడములో వార్తలు
1-20 కన్నడ గీతావళి
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 గానసవై విద్య†
2-00 వాతావరణ సూచన,
వనితావిహార
2-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* ఎస్. జయలక్ష్మి
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు,
వాతావరణ సూచన (ఆంగ్లం)
6-10 గీతగంధ‡
6-35 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీతె†
7-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 ప్రసంగం (కన్నడం)
8-10 వాద్యశ్రీ†
8-15 శ్రోతల ఉత్తరాలకు జవాబులు
8-30 యువజనుల కార్యక్రమము
9-00 ఆంగ్లములో వార్తలు
9-45 బెలకావాడి వరదరాజ అయ్యంగార్
10-15 గానవాహిని†
10-35 వాతావరణ సూచన,
జనగణమన, ప్రసార సమాప్తి



* వరుసయందు మాతవ  † గ్రామఫోన్ రికార్డ్  ‡ స్టూడియో రికార్డింగ్

## సోమవారం జనవరి 2

శక 1888 పుష్య 12

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6-00* వందేమాతరం, మంగళధ్వని కార్యక్రమ వివరణ
6-10 భక్తిరంజని
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సూక్తిముక్తావళి
6-50 వాద్యగోష్ఠి
7-00 తెలుగులో వార్తలు
7-15 ఐ. చెల్లాయ్
7-30 సంస్కృత పాఠము
7-45 శాస్త్రీయ సంగీత్†
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 విలాయత్ హుస్సేన్‌ఖాన్
9-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-45* ఉన్నత పాఠశాలలకు తెలుగు పాఠము (IX తరగతికి)
ప్రతాపరుద్రుడు రూపకం
రచన: మునిమాణిక్యం నరసింహారావు
చర్చవేదిక
12-05 ప్రసార సమాప్తి

ప్రసారము III

12-30* కార్మికుల కార్యక్రమము (విజయవాడనుండి రిలే)
1-00 స్త్రీల కార్యక్రమము (హిందీ)
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 చిత్రపథ్ సే†
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, లలిత సంగీత్:
2-10 ఉర్దూలో వార్తలు
2-20 మరాఠీ పాటలు†
2-30 For the High Schools English lesson for Class XI presented by Central Institue of English, Hyderabad
2-50* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-30* స్థానిక ప్రకటనలు
5-35 లలిత సంగీతం: ఎస్. సిహెచ్. రంగనాథన్
5-50 పద్యపఠనం:
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ) (హైదరాబాద్, కడపలు మాత్రమే)
6-25 ముఖ్యప్రకటనలు, విరామ సంగీతం
6-30 వ్యావసాయిక విషయాలు
సహకార రంగము- సూపర్ మార్కెట్లు ప్రసంగం
ప్రాథమిక ఆరోగ్యసూత్రాలు ప్రసంగం
ధరల సమీక్ష, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 దీక్ష
7-30 అభిజ్ఞుల అభిప్రాయం
7-45 చిత్రసీమ†
8-00 For the Universities (relay from Vijayawada)
8-30 Sports round-up (relay from Delhi)
8-40 చిత్రసీమ†
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 జానపద గేయాలు
9-45 రసమయి (మద్రాస్‌నుండి రిలే)
10-00 సుబద్ధ సంగీత్
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 హిందీలో వార్తలు
10-40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

### కడప

333.3 మీ (900 కిలోసై)

సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు
శనివారములు మాత్రము
సా॥ 5-30 నుండి రా॥ 11-10 వరకు

### విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు

ఉ॥ ప్రసారము I

89.42 మీ (3355 కిలోసై)
(హైదరాబాద్ మాత్రమే)

6-00* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, శుభోదయం, ప్రసార విశేషాలు
6-10 భక్తిరంజని (హైదరాబాద్‌నుండి రిలే)
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సూక్తిముక్తావళి (హైదరాబాద్‌నుండి రిలే)
6-50 బజారు ధరలు
6-55 విరామ సంగీతం
7-00 తెలుగులో వార్తలు
7-15 హైదరాబాద్ వలె
7-30 సంస్కృతపాఠము (హైదరాబాద్‌నుండి రిలే)
7-45 సంగీత శిక్షణ (జూనియర్లకు)
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 హైదరాబాద్ వలె
9-00 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

62.50 మీ (4800 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
8-30 టి. సులోచన: వీణ
9-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై)
(హైదరాబాద్ మాత్రమే)

11-45 హైదరాబాద్ ఎ వలె
12-05 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III

12-30* హైదరాబాద్ ఎ వలె
1-00 గాత్రసంగీతం
1-30 హైదరాబాద్ ఎ వలె
2-10 గాత్రసంగీతం
2-20 హైదరాబాద్ ఎ వలె
2-50* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

60.12 మీ (4990 కిలోసై)

5-30* హైదరాబాద్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 హైదరాబాద్ ఎ వలె
9-15 In the News
9-20 విరామ సంగీతం
9-30 హైదరాబాద్ ఎ వలె
10-00 ఐ. చెల్లాయి
10-30 హైదరాబాద్ బి వలె
10-40 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

ప్రసారము II

12-30 కార్మికుల కార్యక్రమము
ఫిల్మ్ సంగీతం†
ప్రమాదాలు-తీసుకోవలసిన జాగ్రత్తలు ప్రసంగం
ధర్మసందేహాలు
1-00 చల్లపల్లి కృష్ణమూర్తి
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* స్థానిక ప్రకటనలు
5-35 లలిత సంగీతం, పద్యపఠనం (హైదరాబాద్‌నుండి రిలే)
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 వాద్య బృందము
6-15 ప్రాంతీయ వార్తలు
6-25 ముఖ్యప్రకటనలు, విరామ సంగీతం
6-30 పంట సీమలు
7-00 తెలుగులో వార్తలు
7-15 హైదరాబాద్ వలె
7-45 చిత్రతరంగిణి- ఫిల్మ్ సంగీతం†
8-00 For the Universities
8-30 Weekly Sports round-up (relay from Delhi)
8-45 గానసుధ†
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 In the News
9-20 విరామ సంగీతం
9-30 ఆంధ్రప్రదేశ్ జానపదగేయాలు (హైదరాబాద్‌నుండి రిలే)
9-45 రసమయి (మద్రాస్‌నుండి రిలే)
10-00 భక్తిరంజని త్యాగరాజ కీర్తనలు
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48-వ పేజీలో]



* సమయసూచిక † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

## సోమవారం జనవరి 2

శక 1888 పుష్య 12

## మద్రాస్-ఎ

416.7 మీ (720 కిలోసై)
ఉ॥ 6.00 నుండి రా॥ 11-00 వరకు
మ॥ 11-55 నుండి 2-30 వరకు
సా॥ 5-30 నుండి రా॥ 12-00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
41.90 మీ (7160 కిలోసై)
మ॥ 11-55 నుండి 2-30 వరకు
60.98 మీ (4920 కిలోసై)
సా॥ 6-40 నుండి రా॥ 11-00 వరకు

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం,మంగళగానం
6-05 తిరుప్పావై తిరువెంబావై
6-20 తుదిప్పాడల్‌గళ్
6-30 నేటికార్యక్రమ వివరణ, వాతావరణసూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 బజారు ధరలు
6-45 సంగీతామృతం
మారెళ్ళ కేశవరావు: వయొలిన్
7-15 తమిళములో వార్తలు
7-30 అహింసయిన్ కురళ్
7-35 తిరువిళిమిళలై గోవిందరాజ పిళ్ళై సోదరులు: నాదస్వరం
8-50 చిత్రగానం
వడిత్త మనైవి
సారంగధర, సరస్వతి శపథం
కుంకుమం, కాట్టురోజా
శారద, పణితిరై
పార్థివన్ కణవు
9-15 నాగర్‌కోయిల్ ఎస్. గణేశన్
9-45 సంగీతమంజరి
10-00 రాజం పుష్పవనం
10-30 మధురగీతం
10-55 అంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ సెయిదిగళ్
12-00* కార్మికుల కార్యక్రమము
12-30 నాగర్‌కోయిల్ ఎస్. గణేశన్
1-00 రూపకం (తమిళం)
1-30 వాద్య గోష్ఠి
1-45 చిత్రగానం
రాధ, జయలక్ష్మి
1-55 వాతావరణసూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* సంగీత మంజరి
5-45 రూపకం (తమిళం)
6-00 విరామ సంగీతం
6-05 ప్రాంతీయ సెయిదిగళ్
6-15 సెయిదికురిప్పుగళ్
6-20 చిత్రగానం†
పాసమలర్
పెరియఇడత్తు పెణ్
కులమగళ్ రాధై
కలైకోయిల్, అన్నై ఇల్లం
అన్పేవా, జగదల ప్రతాప్
6-45 రాజం పుష్పవనం
7-15 తమిళములో వార్తలు
7-30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8-00 శ్రోతలు కోరిన పాటలు
8-30 తపాల్ పెట్టి
8-45 రాగవిళక్కం: హంసధ్వని
9-00 అంగ్లములో వార్తలు
9-15 ప్రసంగం (తమిళం)
9-30 వాద్య సంగీతం
9-45 రాగం, తానం, పల్లవి: ముడికొండాన్ వెంకట్రామ అయ్యర్
వి. ఎల్. వేదగిరి: వయొలిన్
కోయంబత్తూర్ ఎస్. రామస్వామి: మృదంగం
ఎమ్. ఎస్. కందస్వామి: కంజీరా
10-30 చిత్రగానం
కొడిమలర్, అన్నూతరంగళ్
కన్నిత్తాయ్, అన్నై
కుళందయుం దైవముం
ఆనందజ్యోతి
కళంగరై విళక్కం, ఆనంది
11-00 నాటిక (తమిళం)
11-30 పామాలై†
టి. ఆర్. మహాలింగం: వేణువు
11-55 అంగ్లంలో వార్తలు
12-00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)

6-00 మద్రాస్ ఎ రిలే
6-40 అంగ్లములో వార్తలు
6-45 మద్రాస్ ఎ రిలే
7-00 తెలుగులో వార్తలు
7-15 ఇశైక్కోలం: సమర్పణ: ఎ. నారాయణ అయ్యర్
7-30 మద్రాస్ ఎ రిలే
8-00 అంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసై)

11-55 మద్రాస్ ఎ రిలే
1-00 Light classical variety†
1-30 అంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసై)
[5-30 నుండి 6-40 వరకు 60.98 మీటర్లపై గూడా]

‡5-30* Pop session†
6-00 అంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ రిలే
6-20 వాతావరణ సూచన, స్థానిక ప్రకటనలు, వాణిజ్య వార్తలు, కార్యక్రమ వివరణ
6-45 మద్రాస్ ఎ రిలే
‡7-00 తెలుగులో వార్తలు
7-15 చిత్రగానం †
కులగోత్రాలు
కర్ణ
పూజాఫలం
మహిషాసుర మర్దని
7-30 గీతమాలిక
8-00 Spotlight : A causerie on men and matters
8-15 వాద్య సంగీతం : వయొలిన్ యుగళం
8-30 Sports round-up (relay from Delhi)
8-45 వాద్య సంగీతం: వీణ, గోటువాద్యం
9-00 అంగ్లములో వార్తలు
9-15 In the News
9-20 విరామ సంగీతం
9-30 పరిమిత కుటుంబం రూపకం రచన: పి. నాగాంజనేయులు
9-45 మహాభారతమునందు రామాయణ అనుకరణాల పోకడలు ప్రసంగం
10-00 భక్తిరంజని
10-30 అంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
(వివిధభారతి రిలే)
[వివరాలు 48-వ పేజీలో]

## బెంగుళూర్

ఉ॥ ప్రసారము I

491.8 మీ (6108 కిలోసై)

6-30* వందేమాతరం, మంగళధ్వని సుప్రభాత, విచారదీప్తి వాతావరణసూచన
6-40 అంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
7-10 హెచ్. కె. నరోజ
7-40 బజారు ధరలు
7-45 కన్నడములో వార్తలు
8-00 అంగ్లములో వార్తలు
8-15 వాద్యవృంద
8-30 సి. కె. తార
8-40 బజారు ధరలు
8-50 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము II (బెంగుళూర్ మాత్రమే)

12-30* ఫణీంద్రకుమారి కేసరి
1-00 గానామృత†
1-10 కన్నడములో వార్తలు
1-20 నవరస్
1-30 అంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 నవరస్
2-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

3-00* ఉన్నత పాఠశాలలకు
3-20 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-30* కార్మికుల కార్యక్రమము
6-00 అంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు వాతావరణసూచన (అంగ్లం)
6-10 ఉర్దూ పాటలు†
6-20 కన్నడగీతావళి†
6-35 ప్రదేశసమాచార
6-45 చిత్రగీతె†
7-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 శ్రోతలు కోరిన పాటలు†
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 కోరికె†
9-00 అంగ్లములో వార్తలు
9-15 The sky is the limit discussion
9-30 నాటిక (కన్నడం)
10-00 గానవాహిని†
10-30 అంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి


* సహాయసూచన † గ్రామఫోన్ రికార్డ్స్ ‡ స్టూడియో రికార్డింగ్

# మంగళ జనవరి 3

శక 1888 పుష్య 13

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I
405.4 మీ (740 కిలోసై)

6-00* వందేమాతరం, మంగళధ్వని
కార్యక్రమ వివరణ
6-10 భక్తిరంజని
(విజయవాడనుండి రిలే)
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సూక్తి ముక్తావళి
6-50 వాద్య గోష్ఠి:
నిలయవిద్వాంసులు
7-00 తెలుగులో వార్తలు
7-15 విజయవాడ వలె
7-45 సుగం సంగీత్:
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 విజయవాడ వలె
9-00* వాతావరణసూచన,
ప్రసార సమాప్తి

ప్రసారము II

11-45* ఉన్నత పాఠశాలలకు
తెలుగు పాఠము
(X-వ తరగతికి)
వాణి నా రాణి రూపకం
రచనావళి
సంచికా కార్యక్రమము
12-05 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III

12-30 *కార్మికుల కార్యక్రమము
పాటలు †
కార్మికులు-కుటుంబ నియంత్రణ
ప్రసంగం
లోకాభిరామాయణం
1-00 వనితావాణి
(విజయవాడనుండి రిలే)
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 చిత్రపధ్ సే †
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణసూచన,
లలిత సంగీతం:
2-10 ఉర్దూలో వార్తలు
2-20 ఎల్. రైనా
2-30 For High Schools
English lesson
for Class IX
presented by the
Central Institute of
English, Hyderabad
2-50 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-30* స్థానిక ప్రకటనలు
5 35 విజయవాడ వలె
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 ప్రాంతీయ వార్తలు (ఉర్దూ)
(హైదరాబాద్, కడపలు మాత్రమే)
6-25 ముఖ్యప్రకటనలు,
విరామ సంగీతం
6-30 గ్రామస్థుల రేడియో గోష్ఠి
ప్రత్యుత్తర వేదిక
రెండవ వరిపంట-ముందు
తరినార్ల పద్ధతి
శతలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 దీక్ష
7-30 రేడియో వార్తావాహిని
7-45 సుఖరోగాలు-నివారణ
ప్రసంగం
డా॥ పి. తిరుమలరావు
7-55 విరామ సంగీతం
8-00 మీరు కోరిన పాటలు †
8-30 Radio News Reel
(relay from Delhi)
8-40 వాద్యగోష్ఠి:నిలయవిద్వాంసులు
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 శర్మిష్ఠ సంగీత రూపకం
రచన: డి. వి. కృష్ణశాస్త్రి
సమర్పణ: పి. విశ్వనాథం
10-30 హైదరాబాద్ బి వలె
11-50 హిందీలో వార్తలు
11-55 ఆంగ్లములో వార్తలు
12-00 వాతావరణసూచన,
జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

---

## కడప

333.3 మీ (900 కిలోసై)
సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు
శనివారములు మాత్రము
సా॥ 5-30 నుండి రా॥ 11-10 వరకు

## విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)
సా॥ 5-30 నుండి రా॥ 10-40 వరకు

---

ఉ॥ ప్రసారము I
89.42 మీ 3355 కిలోసై)
(హైదరాబాద్ మాత్రమే)
6-00* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి
ప్రసారము I (తరువాయి)
62.50 మీ (4800 కిలోసై)
8-00 హైదరాబాద్ ఎ వలె
9-00 వాతావరణసూచన,
ప్రసార సమాప్తి

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-00* వందేమాతరం, శుభోదయం,
ప్రసార విశేషాలు
6-10 భక్తిరంజని:
ఆంజనేయ స్తవం,
తరంగములు
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 సూక్తి ముక్తావళి
6-50 బజారు ధరలు
6-55 విరామ సంగీతం
7-00 తెలుగులో వార్తలు
7-15 గోవద వెంకటసుబ్బారావు:
క్లారినెట్
7-45 సంగీత శిక్షణ (జూనియర్లకు)
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 కొత్తా ప్రియంవద
9-00 ప్రసార సమాప్తి

---

ప్రసారము II

11-45* హైదరాబాద్ ఎ వలె
12-05 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము III
42.02 మీ (7140 కిలోసై)
(హైదరాబాద్ మాత్రమే)

12-30* హైదరాబాద్ ఎ వలె
2-10 గానసుధ†
2-20 హైదరాబాద్ ఎ వలె
2-50 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV
62.50 మీ (4800 కిలోసై)

5-30* హైదరాబాద్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 హైదరాబాద్ ఎ వలె
9-15 In the News
(relay from Delhi)
9-20 విరామ సంగీతం
(ఢిల్లీనుండి రిలే)
9-30 హైదరాబాద్ ఎ వలె
10-40 వాతావరణసూచన,
జనగణమన, ప్రసార సమాప్తి

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

మ॥ ప్రసారము II

12-30 కార్మికుల కార్యక్రమము
(హైదరాబాద్‌నుండి రిలే)
1-00 వనితావాణి
పాట
వ్యక్తిత్వం నిలుపుకో-గృహిణిగా
ప్రసంగం
జయా శ్రీకంఠయ్య
వార్తావళి, మంగళం
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* స్థానిక ప్రకటనలు
5-35 లలిత సంగీతం:
పురాణకాలక్షేపం
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 వాద్య బృందం
6-15 ప్రాంతీయ వార్తలు
6-25 ముఖ్య ప్రకటనలు,
విరామ సంగీతం
6-30 పంటసీమలు
7-00 తెలుగులో వార్తలు
7-15 దీక్ష
7-30 రేడియో వార్తావాహిని
(హైదరాబాద్‌నుండి రిలే)
7-45 చిత్రతరంగిణి-ఫిల్మ్ సంగీతం†
8-00 ఉభయకుశలోపరి-
శ్రోతల ఉత్తరాలకు జవాబులు
8-15 Examining the examiner
talk by
Dr. H. J. Taylor
8-30 Radio News Reel
8-45 ప్రాదేశిక్ సుగం సంగీత్
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 In the News
9-20 విరామ సంగీతం
9-30 హైదరాబాద్ వలె
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 జనగణమన, ప్రసార సమాప్తి

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

మంగళవారం జనవరి 3

శక 1888 పుష్య 13

## మద్రాస్-ఎ

ఉ॥ ప్రసారము I

416.7 మీ (720 కిలోసై)
ఉ॥ 6-00 నుండి 11-00 వరకు
మ॥ 11-55 నుండి 2-10 వరకు
సా॥ 5-30 నుండి రా॥ 12-00 వరకు
60.98 మీ (4920 కిలోసై)
ఉ॥ 6-30 నుండి 9-15 వరకు
41.90 మీ (7160 కిలోసై)
మ॥ 11-55 నుండి సా॥ 2-10 వరకు
60.98 మీ 4920 కిలోసై)
సా॥ 6-40 నుండి రా॥ 11-00 వరకు

6-00 వందేమాతరం, మంగళగానం
6-05 తిరుప్పావై, తిరువెంబావై
6-20 తుదిప్పాడల్‌గళ్
6-30 నేటి కార్యక్రమ వివరణ, వాతావరణసూచన
6-35 అరుళ్ వాక్కు
6-40 బజారు ధరలు
6-45 సంగీతామృతం: ఎస్. రమణి: వేణువు
7-15 తమిళములో వార్తలు
7-30 అహింసయిన్ కురళ్
7-35 శూలమంగళం జయలక్ష్మి శూలమంగళం రాజలక్ష్మి కున్నక్కుడి వైద్యనాథన్: వయొలిన్ పాల్ఘాట్ కె. కుంజుమణి: మృదంగం
8-50 గీతమంజరి
9-15 కమలా త్యాగరాజన్: వీణ
9-45 ఎమ్. భవాని
10-30 మధురగీతం
10-55 ఆంగ్లములో వార్తలు
11-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-55 ప్రాంతీయ శెయిదిగళ్
12-00* కార్మికుల కార్యక్రమము
12-30 సి. ఎస్. రాజారామన్
1-00 పూదర్ నిగప్పి ప్రీలత
1-30 వాద్య గోష్ఠి
1-45 చిత్రగానం పళని
1-55 వాతావరణ సూచన
2-00 తమిళములో వార్తలు
2-10 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-30* కమలా త్యాగరాజన్: వీణ
6-00 విరామ సంగీతం
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 శెయిదికురిప్పుగళ్
6-20 చిత్రగానం† ఆండవన్ కట్టళై అమ్మా ఎంగే ఎంగవీట్టు పిళ్లై, చిత్తి దైవత్తాయ్ చిన్నంచిరు ఉలగం
6-45 నాటిక (తమిళం)
7-10 విరామ సంగీతం
7-15 తమిళములో వార్తలు
7-30 వ్యవసాయదారులకు (తిరుచ్చినుండి రిలే)
8-00 రూపకం (తమిళం)
8-30 మెల్లిశై: ఎ. నిత్యకళ, ఎస్. ఎస్. చంద్రపాణి
8-45 వాద్య సంగీతం: క్లారినెట్: నిలయవిద్వాంసులు
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఎమ్. జి. గౌరీ కుమారి. వీణ
10-30 చిత్రగానం పూంపుహార్, రక్తతిలకం పచ్చై విళక్కు, శాంతి పెరియ ఇడత్తు పెణ్ రాము, సరస్వతి శపథం
11-30 పామాలై† కె. బి. సుందరాంబాళ్
11-00 ఫయాజ్ ఖాన్
11-55 ఆంగ్లములో వార్తలు
12-00 జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I

211.3 మీ (1420 కిలోసై)

6-00 మద్రాస్ ఎ వలె
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతమంజరి
7-30 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211.3 మీ (1420 కిలోసై)

11-55 మద్రాస్ ఎ వలె
1-00 Piano Concerto movements†
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211.3 మీ (1420 కిలోసై)
(5-30 నుండి 6-40 వరకు 60.98 మీటర్లపై కూడా)

5-30* Stanley Gomes (Violin) Adi Gazder (Piano)
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-20 వాతావరణసూచన స్థానిక ప్రకటనలు వాణిజ్య వార్తలు కార్యక్రమ వివరణ
6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు
7-15 పుస్తక సమీక్ష డి. చిన్నికృష్ణయ్య
7-30 గీతమాలిక
8-00 సి. ఎస్. రాజారామన్
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 వాద్య సంగీతం
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 In the News
9-20 విరామ సంగీతం
9-30 Pop session†
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణసూచన, జనగణమన, ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

## బెంగుళూరు

ఉ॥ ప్రసారము I

491.8 మీ (610 కిలోసై)

6-30* వందేమాతరం, మంగళధ్వని సుప్రభాత, విచారదీప్తి, వాతావరణసూచన
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 గీతారాధన
7-10 ఎ. ఎస్. ప్రసన్నకుమారి
7-40 బజారు ధరలు
7-45 కన్నడంలో వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 సంస్కృత పాఠము
8-30 కన్నడ గీతావళి
8-40 బజారు ధరలు
8-50 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II (బెంగళూరు మాత్రమే)

12-30 వనితావిహార
1-00 శాంతాల గురురాజ్
1-10 కన్నడములో వార్తలు
1-20 శాంతాల గురురాజ్
1-30 ఆంగ్లములో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 శాంతాల గురురాజ్
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

3-00* ఉన్నత పాఠశాలలకు
3-20 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

5-30* కార్మికుల కార్యక్రమము
6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు, వాతావరణసూచన (ఆంగ్లం)
6-10 మనెయమాతు
6-20 పాదుకా పట్టాభిషేక సీరియల్ నాటిక (కన్నడం)
6-35 ప్రదేశ సమాచార
6-45 చిత్రగీత †
7-00 గ్రామస్థులకు
7-45 కన్నడములో వార్తలు
8-00 ఆటల సమీక్ష (కన్నడం)
8-10 వాద్యశ్రీ †
8-15 For the Universities
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 వాద్యశ్రీ†
8-45 నవసుమ: ఈ మాసపు పాట
8-50 వేణువు†
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 సమాచార దర్శన
9-25 వాద్య సంగీతం†
9-30 ఆర్. ఆర్. కేశవమూర్తి: వయొలిన్
10-35 వాతావరణ సూచన, జనగణమన, ప్రసార సమాప్తి

* సమయసూచన † గ్రామఫోన్ రికార్డు ∮ స్టూడియో రికార్డింగ్

